ప్రాణమైన మాధుర్యము వెల్లివిరిసినది. సౌకుమార్యము పద్మమునందే కాక, దానిని జితిరించు తీరునందు మఱెంత తొలఁకియాడినది. శ్రీనాథుని సీసముల కూర్పులోని శిల్పము సర్వాంగసుందరమై యవతరించినది. ఒక్క-పద్మము వికసించిన తీరు నాలుగు సీసపాదములలోఁ జిత్రించుటలోనే కావ్యత్వ ముట్టిపడుచున్నది.

తుదిపాదములో "లక్ష్మి పద్మనయను నర్థి వరియించె లీలా స్వయంవరమున"అనినాఁడు. పద్మాలయ యగుటచేతనే పద్మనయనుని ప్రీతితో లీలాకల్పితమైన స్వయంవరమునందు వరియించినదఁట. ఈ స్వయంవరమును సంస్కృతకవి యొకఁ డిట్లు చమత్కరించియున్నాడు.

శ్లో. ఆఖ్యాతే హసితం పితామహ ఇతి త్రస్తం కపాలీతి చ
వ్యావృత్తం గురు రిత్యయం దహన ఇత్యావిష్కృతా భీరుతా
పౌలోమీపతి రిత్యనూయిత మథ వ్రీడావినమ్రశ్రియా
పాయాద్వః పురుషోత్తమోఽయమితియో న్యస్తస్స పుష్పాంజలిః.

క్షీరసాగరకన్యక పద్మమధ్యమునుండి లేచి, సముద్రతీరమునందున్న దేవతాగణమును లక్షించి, పూలమాల చేతఁ బట్టుకొని, స్వయంవరమునకు బయలుదేఱినది. ముందుగ బ్రహ్మను జూపి 'ఈతఁడు పితామహుఁడు' అనినంతనే నవ్వినది. యువతి తాతను బెండ్లాడుట కంగీకరించునా? పిమ్మట నీశ్వరుని జూపి 'కపాలి' అనినంతనే వికృతమైన కపాలధారణమును విని భయపడినది. ఈతఁడు 'దేవగురువు' అనినంతనే మొగము త్రిప్పివేసినది. 'దహనుఁడు' (అగ్ని) యనినంతనే తన్నుఁగూడ దహింపఁజేయు నేమో యని భీతిల్లినది. ఇంద్రుని జూపి ఈతఁడు 'శచీ

పతి' అని యీతని వరింపు మనఁగా, అడుగు పెట్టినంతనే సవతి పోరు సంభవించు నని యసూయపడినది. తుదికి విష్ణుని జూపి, ఈతఁడు 'పురుషోత్తముఁడు' అని తెలిపినంతనే సిగ్గుచేఁ దలవంచుకొని పద్మాలయ పద్మనయనునివక్షమునఁ బూలమాలిక వైచెనఁట. ఇట్టి లీలాస్వయంవరమును శ్రీనాథుఁ డీపద్యమున ధ్వనింపఁజేసినాఁడు. కమలాలయ వరింప నన్యువైన దేవతాసమితి యచటనే కూడియుండెను; గాన స్వయంవరమునకై యత్న మక్కఱ లేకయే హేలగ నామె పురుషోత్తముని వరింపఁగల్గిన దనుట యిచట వ్యక్తమగుచున్నది.

కాలకూటోత్పత్తికి, దద్భక్షణమున జగదుపద్రవ నివారణచేఁ బరమేశ్వరుని మహత్త్వము వ్యక్తము చేయుటకు మూలము అమృతోత్పత్తియే. ఆయమృత ముద్భవించుట, దానికై దేవాసురులు కలహించుట, శ్రీమన్నారాయణుఁడు జగన్మోహినీ రూపమున రాక్షసులను వంచించి, దేవతల కమృతము వంచిపెట్టుట యనువిషయములను రెండు పద్యములలో సూక్ష్మముగ నిరూపించినాఁడు.

ఉ. అంతులు మీఱి మిక్కిలిగ తాగతనంబున దొమ్మిచేసి, దు
ర్దాంత పరాక్రమోన్నతులు దానవదైత్యులు వేల్పువెజ్జు ధ
న్వంతరిచేతి దుగ్ధమయవారిసుధారస పూర్ణకుంభమున్
సంతనకట్టి పుచ్చుకొని చయ్యన నేఁగిరి నిర్విశంకతన్.

వ. అప్పుడు——

క. నారాయణుండు మాయా
నారీరూపమునఁ గపటనాటక లీలా
పారాయణత హరించె సు
రారులచే నమృతకలశ మాసమయమునన్. ౮-౯౩, ౯౪.

ఈవిధముగ జగన్మోహినీ రూపమును దాల్చి యమృత మును హరించి, దేవతలకుఁ బంచిపెట్టిన విష్ణుమాయను సూచనామాత్రి సారముగఁ దెలిపి, దానవు లిట్టు లమృతమును గోలుపోవుట త్రిపురాసుర సంహారమునకు నాందిగాఁ జిత్రించినాఁడు. భీమనాధుని లీలామాత్రమునే యిందు కవి వర్ణింపఁబూనినాఁడు గావున, మాయానారీరూపవర్ణనము కావ్యత్వమునకు ముఖ్యసామగ్రి యయినను దానిని వదలివేసి నడుమ నారదపాత్రను బ్రవేశపెట్టి, యాతనిచే నసురులహృదయములం దమృతము కోలుపోయినందులకు దేవతలపై ద్వేషమును రగులుకొల్పినాఁడు. అమృతమును గోలుపోవుట ద్వేషకారణమే యైనను, దానిని నారదముఖమున దానవులకుఁ జెప్పించి, వారికి నుద్రేకము హెచ్చనీశ్వరోపాస్తి నుపాయముగ నిరూపించి, దానవసంహారము నీశ్వరునిచేఁ జేయింప సమకట్టి, వీరరసబీజమును నాఁటినాఁడు.

### త్రి పు రా సు ర సం హా ర ము

శంకరుఁడు లోకకంటకు లయినత్రిపురాసురులఁ బరిమార్చుటకై మహత్తరసంరంభముతో నుద్యమించినపుడు భూమి రథముగను, సూర్యచంద్రులు చక్రములుగను, బ్రహ్మ సారథిగను, నాల్గువేదములు గుఱ్ఱములుగను, ఓంకారము ప్రతోదముగను (కొరడాకట్టగ) నక్షత్రపంక్తి జండాగను, మేరుపర్వతము ధనుస్సుగను, ఆదిశేషుఁడు నారిగను, వాయువులు బాణమునకు ఱెక్కలుగను, ప్రళయకాలాగ్ని ములికిగను, విష్ణువు బాణముగను జతగూడఁగా, పట్టణములతోపాటు త్రిపురాసురులను సంహా

రించి, వారల కుపాస్యమైన లింగమును, పంచవిధములుగా విభజించి పంచారామములందును పంచలింగములుగా వెలయించుట యీత్రిపురాసుర సంహారమునందలి ప్రధానమైన యితివృత్తము. త్రిపురాసురసంహారమునకుఁ బరమేశ్వరుఁ డాయత్తపడుటకుఁ గారణము త్రిపురాసురు లుద్రేకించి లోకముల కుపద్రవము గలిగించుట. అట్టి యుద్రేకము వారికిఁ గలుగుటకు మూలము, నారదుఁడు వారిని బరమేశ్వరు నారాధింపుఁ డని ప్రోత్సహించుట.

దేవాసురులు సముద్రమును మథింపఁగా వెలువడిన యమృతమును, విష్ణువు దేవతలకే పంచిపెట్టి వెడలిపోయినవెనుక నారదుఁడు దానవులకడ కేఁగి వారితో—

శా. రక్షోనాయకులార! నిర్జరవరవ్రాతంబుచేతన్ సుధా
భిక్షాపాత్రము వోయె నంచు మదిలోఁ బెగ్గిల్లఁగా నేఁటికిన్
రక్షార్థంబు భజింపరాదె యభవున్ త్రైలోక్యకుక్షింభరున్
దక్షారామపురాధినాథుని సుధాధామార్ధచూడామణిన్.

అని యుపదేశము చేసినాఁడు. అమృతధామ మగుచంద్రఖండమును శిరోభూషణముగఁ దాల్చిన భీమనాథుని భజించిన మీకమృతము కోలుపోతి మనువంత తీఱును. అతని కుక్షిలోఁ ద్రిలోకములు నిమిడియున్నవి. అతని యనుగ్రహము మీపైఁ గలిగిన నమృతము లభించుట యెంతపని యని యనినట్లయినది. అతఁడు త్రైలోక్యమును గుక్షిలో నంతర్హితము చేయు ననుమాటకూడ నిందు ధ్వనించుచునే యున్నది. ఇచ్చట నారదోక్తివలన నుత్సుకులై దానవులు త్రిపురాసురులతోఁ గూడి, దక్షారామమునకుఁ జేరి, పాశుపతవ్రతాచారముచేఁ బరమేశ్వరు నారాధించి రసి

తెలిపిన యీ ఘట్టములో షట్కాలములందు శంభుపూజావిధాన మెట్టు లుండునో యెఱుఁగవచ్చును.

సీ. అరుణోదయంబున నా కాళవాహినీ
హేమాంబుజంబుల నిందుధరుని
మిహిరోదయంబున మహిసాక్షిగుగ్గులు
ధూపధూమంబుల దురితహరుని
సంగవంబున గంధసారకుంకుమచంద్ర
జంబాలమునఁ బుష్పచాపమథను
మధ్యాహ్నమునఁ బక్వమధురాన్నపాయసా
పూపాజ్యదధిఫలంబులఁ ద్రిణేత్రుఁ
బరమసంధ్యాగమంబునఁ బటహశంఖ
ఝల్లరీమడ్డుడమరు ఝర్ఝరులమ్రోఁత
నర్ధరాత్రములందు వీణారవముల
హరుని బూజింతు రతిభక్తి నసురవరులు.

అరుణోదయకాలమునకుఁ బరమేశ్వరున కంబుజములతోఁ బూజలు, సూర్యోదయకాలమున ధూపము, సంగవకాలమున (నాల్గు గడియలు ప్రొద్దెక్కినపుడు) చందనాదిసుగంధద్రవ్యములతో మైపూఁత, మధ్యాహ్నకాలమున మధురాన్నఫలాదినైవేద్యసమర్పణము, సాయంసంధ్యాసమయమున భేరీశంఖాదివాద్యములు మ్రోయించుట, అర్ధరాత్రిసమయమున వీణారవములు కూడునట్లు లర్చించుట పాశుపతవ్రతులకుఁ జేయవలయు ననువిషయము మన కీయసురపూజావిధి తెలుపుచున్నది. పరమశైవులు క్రొంద తీవిధిని నేఁటికిని జరిగించుచునే యున్నారు. షట్కాలశంభుపూజ శివభక్తుల కవశ్యకర్తమగుట నీ కావ్యమున వ్యాసునిచే

"షట్కాలశంభుపూజావిధానములకుఁ బల్లవప్రసవదర్భలును గలవె?"యని యగస్త్యు నడిగించినాఁడు. అట్టి షట్కాలశంభుపూజావిధానమున కీపద్యము వివరణము.

అంతటితోఁబోక యసురులు పరమేశ్వరునిప్రసాదమును బడయుటకు పంచప్రణవములతోడను షడంగములతోడను గూడిన ప్రాసాదపంచాక్షరీమంత్రముల నీశ్వరుని బిల్వపత్రములతోఁ బూజించుచు, వేదపురాణములచేఁ బ్రస్తుతించిరఁట. ఆతీరు నిట్లు వివరించినాఁడు శ్రీనాథుఁడు.

ఉ. పంచబ్రహ్మషడంగమంత్రములనుం బ్రాసాదపంచాక్షరిం
బంచాస్యుం బహుబిల్వపత్త్రముల నభ్యర్చింతు రవ్యగ్రత
న్మంచుంగొండయనుంగుఁబెండ్లికొడుకు న్వర్ణింతు రేకాగ్రతం
బంచద్వేదపురాణమంత్రముల నిష్ఠాయుక్తి నక్తంచరుల్. ౪. ౧౨౪.

ఇచట సంస్కృతమూలములో,

"మంత్రైః పంచాననం పంచబ్రహ్మపంచాక్షరాదిభిః
పూజయంతి ప్రతిదినం భక్త్యా బిల్వదళైర్నవైః
నిష్ఠాపరాః కీర్తయంతి వేదమంత్రైస్సురద్విషః
తథా పురాణమంత్రైశ్చ విశ్వైకస్తుత్య మీశ్వరమ్."

అని పంచప్రణవములతోఁ గూడిన పంచాక్షరీమంత్రములచేఁ బరమేశ్వరునిఁ బూజించిరని యుండఁగా, శ్రీనాథుఁడా పంచాక్షరీమంత్రమును ప్రాసాదపంచాక్షరినిగా నిరూపించుటచే, శ్రీనాథుఁ డుపాసించిన మంత్రము ప్రాసాదపంచాక్షరి యని స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. ఈతఁడు ఆప్రాసాదపంచాక్షరితో మంచుంగొండయనుంగుఁబెండ్లికొడుకును బూజించినవాఁడు గావుననే పర

మేశ్వరుని యెడ నింతటిభక్తి భావము.

ఇట్టి భక్తితో దానవులు పరమేశ్వరు నారాధించి వరములు వడసి యుద్రేకించి, దేవతలను హింసింప మొదలుపెట్టఁగా వారు భీమనాథుని రక్షింపు మని వేడుకొనునవసరమున వారిచేఁ జేయించిన స్తుతి వేదాంతసారము, భక్తిరసభరితమును. ఇచట శ్రీనాథునకు వేదాంతశాస్త్రమునందుఁ గల పాండిత్యవిశేషము వ్యక్త మగుచున్నది.

దేవతల మొఱ విని పరమేశ్వరుఁడు దివ్యరూపమున నావిర్భవించిన రీతియు భక్తిభావ భరితము; అతివిస్తృతము. కైలాసవాసి సర్వాంగశృంగార మొక్క విస్తృతమైన వచనమునందుఁ జిత్రితమైనది. అతని పరమేశ్వరరూపమున లోకప్రతికృతి నిర్మితమైనది. ఆ తరువాత భీమనాథుఁడు త్రిపురాసుర సంహారమున కాయత్తపడినప్పుడు స్మరణమాత్రమున సమకూడిన సన్నాహము నిట్లు వివరించినాఁడు.

సీ. జలరాశిమేఖలావలయంబు రథ మయ్యె
రవియుఁ జందురుఁడుఁ జక్రంబు లైరి
శారదాజీవితేశ్వరుఁడు సారథి యయ్యె
శ్రుతులు నాలుగును వారువము లయ్యెఁ
బ్రణవమంత్రైకాక్షరము ప్రతోదం బయ్యెఁ
దారకావీథి పతాక యయ్యె
రత్నసానుధరాధరము ధనుర్లత యయ్యె
నాగప్రధానుండు నారి యయ్యె
గంధవాహకంబు లేదును గఱులు గాఁగ
విలయకాలానలజ్వాల ములికిగాఁగ

లచ్చిచనుదోయికుంకుమ బచ్చనయుఁగఁ
బాలమున్నీటియల్లుండు బాణ మయ్యె. ౪-౧౪౦

త్రిపురసంహార సమయమునం దిట్టి సామగ్రి సమకూడుటను మహిమ్న స్తవమునందును పుష్పదంతుఁ డీక్రింది శ్లోకమునఁ దెలిపియే యున్నాఁడు.

శ్లో. రథః క్షోణీ యంతా శతధృతి రగేంద్రో ధను రథో
రథాంగే చంద్రార్కౌ రథచరణపాణిః శర ఇతి,
దిధక్షో స్తే కోఽయం త్రిపురతృణ మాడంబరవిధి
ర్విధేయైః క్రీడన్త్యో నఖలు పరతంత్రాః ప్రభుధియః

త్రిపురాసురసంహారమున విష్ణువు బాణ మగుట వేదములందును బురాణములందును శివభక్తుల స్తవములందును నన్నిటను నేకరూపమున నుండిన విషయమే. శ్రీనాథుఁడు వర్ణించినపుడుమాత్రము "లక్ష్మీకుచకుంకుమాలిప్తుఁడైన క్షీరసముద్రజామాత యల్లుఁడు బాణ మగుట" విశేషము.

కావుననే శంకరుఁ డట్టహాసంబు సేసి యమ్మహాస్త్రంబు నేయఁగా నారాయణాస్త్రవహ్ని త్రిపురదైతేయుల యంతఃపుర కాంతలందు వింతచేష్టలు గావించినది. ఈచేష్టలు కొన్ని శ్రీనాథుఁడు చేయించినవి; కొన్ని అమరుకావ్యమునందుఁ గానవచ్చునవియును. పాలమున్నీటియల్లుఁడు గావుననే వానిచే నిట్టి శృంగారచేష్టలు రౌద్రరసమునడుమఁ జేయించినాఁడు మన కవి. అమరుకావ్యమునం దీవిలాసచేష్ట లిట్లున్నవి:—

శ్లో. క్షిప్తో హస్తావలగ్నః ప్రసభ మభిహతోఽప్యాదదానోంఽశుకాన్తం
గృహ్ణన్కేశే ష్వపాస్త శ్చరణనిపతితో నేక్షిత స్సంభ్రమేణ
ఆలింగ న్యోఽవధూత స్త్రిపురయువతిభి స్సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధ స్సదహతు దురితం శాంభవో వ శ్శరాగ్నిః.

అమరు. ౨.

సీ. కరపల్లవంబులు కబళించుఁ గబళించి
ప్రబలనితంబభారముల వ్రాలుఁ
జెక్కుటద్దములపైఁ జెరలాడుఁ జెరలాడి
శ్రవణావతంసమంజరులు ముట్టు
వలిచన్నుఁగవలపైఁ బొలపోడుఁ బొలపోడి
నాభిరంధ్రములపై నటనసేయు
వేణీభరములపై విహరించు విహరించి
బింబాధరములపై బిత్తరించు
నభవుకరముక్త నారాయణాస్త్రవహ్ని
కాముకుని కోమలాంతసంగంబు పగిదిఁ
దగువమీఱంగఁ ద్రిపురదైతేయరాజ
సదనశుద్ధాంతభామినీజనములందు. ౪-౧౪౦.

భీమనాథుఁడు త్రిపురాసురసంహారము చేయుటకై దివ్యస్యందనం బెక్కి బయలుదేఱునపుడు యాత్రాసన్నాహము రాజఠీవిలో నడిచినది. ముత్తైదువలు సేసలు చల్లుట, వేత్రహస్తులు బరాబరి సేయుట, అంతరిక్షమునుండి దుందుభిధ్వనులతోఁ బుష్పవృష్టి కురియుట, మునిబృందము జయజయధ్వనులు గావించుట మున్నగునవి వీరరససన్నాహమునకు సరిపడినట్లు నడిచినవి. ప్రబంధమునకు యాత్రావర్ణనము సమకూడవలెఁ గదా!

సీ. సరి బ్రాహ్మి మొదలైన సప్తమాతృకలు ద
గ్గాడ సేసలు చల్లె గొంగులమ్మ
పసిఁడివేత్రము పట్టి పాతాళభైరవుం
డందంద సందడి నపనయించె

దివ్యదుందుభి నాద దీర్ఘ గర్జితముతోఁ
గురిసె మిన్నుననుండి కుసుమవృష్టి
జయజయధ్వని దేవసంయమీశ్వరకోటి
సంఘటించెఁ గరాంబుజంబు నొసలఁ

త్రిపురసంహార మొనరింప దీక్ష చేసి
భీమనాథేశ్వరేశ్వరస్వామి శివుఁడు
దక్షవాటీవిభుఁడు మేరుధనువు పట్టి
యేచి పంటకలంతి తే రెక్కినపుడు.

భూమి రథమై మేరువు ధనుస్సయిన దనిగదా యీ వర్ణనము. పర్వతరూపమైన ధనుస్సును బరమేశ్వరుఁ డెట్లు లెక్కువెట్టెనా ? యను సంశయ మెవ్వనికైనఁ బొడమక మానదు కాని యట్టి సంశయము తీర్చినాఁడు కవి. అదియు సరిపడియే యున్నది.

క. ముక్కంటి మేరుచాపం
బెక్కిడి సారించెఁ బన్నగేంద్రగుణంబున్
మక్కువ హిమగిరికన్యక
క్రిక్కిఱిసిన కుచము లలము కేలం దమ్మిన్. ౪-౧౩౯

పరమేశ్వరుఁడు గిరిరాజసుత యొక్క క్రిక్కిఱిసిన కుచములను సారించు హస్తపద్మముతో మేరుధనువు నెక్కిడఁ గల్గుట యాశ్చర్యమేమున్నది ? పర్వతము లన్నిటికంటె మేటిగదా హిమవంతుఁడు. వాని కూఁతురగు పార్వతియాకృతి, యామె కుచములు పర్వతప్రతిమములే యయి యుండును గదా ! అవియును గ్రిక్కిఱిసినవి. వానితో నిత్యము విహరించు నలవాటుగల కరముతో బంగారుకొండను వంచుటలో శ్రమ యంతగ నుండ దనుట యెంతయుఁ బొసఁగియున్నది. ఇట్టి కల్పనలోఁ గావ్యత్వ ముట్టిపడును గదా !

అట్టి ధనుస్సునకు నారియయిన శేషు నెక్కు వెట్టుటలోఁ గూడ సున్నితమైన భావసంపద, కల్పనాసమృద్ధి యేర్పడినది.

సీ. కమ్మినూకిన నూత్నకలధౌతమును బోలెఁ
జక్కంగ నిక్కి మైసొక్కు మూసె
వంతరాంతరములం దస్థిబృందంబులు
పెళపెళ మనియెడు గిలకు లెసఁగఁ
బగిలి బీటలువాఱి తగఁ డెత్తెఁ గుబుసంబు
తోరంపు వెల్లుల్లిపొలుక లట్లు
మహనీయతరఫణామండలంబులు లేఁత
చిగురుటాకుల ఛాయ జేగురించె
హాటకాద్రి ధనుర్దండ కూటకోటి
వంచి బాహావలేప దుర్వారలీలఁ
గాలకంఠుండు త్రిపురసంక్షయా మొనర్ప
నెక్కు వెట్టిన యప్పుడు భోగీశ్వరునకు. ౬-౧౩౨

కాలకంఠుఁడు మేరుధనుర్దండమునకు సరిపడిన పన్నగాధీశుని నారిగాఁగొని, వింటిబద్దను వంచి యల్లెత్రాటిని ధనుర్దండమునకు ఎక్కువెట్టుచున్నప్పుడు వాసుకి శరీరము కమ్మిచ్చులాగిన క్రొత్త బంగారువలె శరీరము నందలి ముడుతలు వీడినది. నడుమ నడుమ నెముకలు పెళపెళమని విరిగినవి. కుబుసము బీటలువాఱి వెల్లుల్లి రేకలలోని పొరలు రేఁగినది పెద్దదయిన పడగలు లేఁత చిగుళ్ళ వలె నెఱ్ఱవాఱినవి. ఈవర్ణనమెంతయు సహజముగఁ గొనసాగినది. దృశ్యము సాక్షాత్కరించునట్టి తీరు, దానితోపాటు కాలకంఠుని బాహావలేపము పాఠకులకుఁ బ్రత్యక్షమైనట్లు లున్నవి.

పరమేశ్వరుఁడు ధనుష్టంకారము చేసినప్పటి యాటోపము వీరరసోత్తేజకమై వెలసినది. రసానుగుణమైన శైలీపాటవము

కూడ నీ క్రింది పద్యమునం దెసలారినది. వృత్తముకూడ సరిపడి నట్లు నడచినది.

శా. గిరిశస్వామిభుజాపరీత విభవక్రీడా సమాస్ఫాలిత
స్థిరశార్ఙ్గాపన గూఢపార్గుణలతా దీర్ఘోగ్రఘోషంబునన్
ధరణీచక్రము దద్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె నం
బరము౦ దిక్కులు వ్రయ్యలయ్యెఁ బగిలెన్ బ్రహ్మాండభాండంబులున్.

అట్టి యాటోపముతో నారాయణుని బాణముచేసి, పాశుపతాస్త్రంబు సమంత్రకంబుగా నభిమంత్రించి, ఫాలలోచనాగ్నిశిఖలతో జోడించి వేయఁగా నమ్మహాస్త్రపాతమున లోహమయమైన త్రిపురాసురుల మూఁడునగరములు కరగిపోయి మూఁడు ముద్దలుగఁ దయారైనవి. పురములలోని భోగోపకరణము లన్నియు భస్మమైపోయినవి. ప్రాసాదములు కేళిదీర్ఘికలు బాహ్యాభ్యంతరకక్ష్యలు ఉపవనములు నన్నియు దగ్ధమైపోయినవి. కాని యచటి కాలాంతకలింగ మొక్కఁడుమాత్రము చెక్కుచెదరక యుండెను. ఆ త్రిపురాసురుల సర్వస్వము భస్మమైపోయినపుడు వారల కుపాస్యమైన పరమేశ్వరలింగము చెడకుండుట వింతగదా! అది శ్రీనాథుని నోట వింతలలో వింతగా వినవచ్చినది

మ. అసురాధీశసమర్పితంబులగు లీలారామకల్పద్రుమ
ప్రసవంబుల్ కసుగందవయ్యె; విలసత్పాటీరగోరోచనా
ఘుసృణాలేపన పంకితాకలనమై గుంఫించె నారాయణా
స్త్రసముజ్జృంభణ భీమలింగమునకున్ దైత్యేయరాట్స్వామికిన్

నారాయణాస్త్రసముజ్జృంభణమున త్రిపురాసురుల కుపాస్యమైన భీమలింగమునకు ఇంద్రుఁ డర్పించిన కల్పసుమములు కసుగందనే లేదఁట. దైత్యకులాంగనలయెడఁ గాముకునిలీల వర్తించిన యా

నారాయణాస్త్రము ఆ లింగమునకు చందనకర్పూర కస్తూరికాది లేపన పరిపాటిని సమకూర్చి పెట్టెనదఁట.

ఇట్టి యద్భుతము లావహిల్లఁగఁ గాలకంఠుఁడు త్రిపురాసుర సంహారము గావించి, జయలక్ష్మిని బరిగ్రహించి, యుద్ధసాధనము లన్నిటిని యథాస్థానమునకుఁ బంపినైచెను. గంధర్వాదులు మహాపదానమగు త్రిపురాసురసంహారము గానముచేయుచుండఁగ సంతోషాతిరేకమున శివుఁడు తాండవము చేసినాఁడు.

శా. ఆడెం దాండవ మార్భటీసటహాలీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుఁడు జూటాటవీ
క్రీడాఘాతకఠోరకోటకరటీ కోటీలుఠచ్ఛింధువీ
చీడోలాపటలీ పరిస్ఫుటతర స్ఫీతధ్వనిప్రౌఢిమన్. ౩-౧౪౫

ఈ శివతాండవములో శ్రీనాథుని కావ్యరచనయు మహోత్కటితోఁ దాండవించినది. శైలిలో గంగాతరంగిణీతరంగధ్వనిప్రక్రిమలు ప్రతిశబ్దించినవి. శివతాండవ మెమరుగ సాక్షాత్కరించినది. ఇట్లు శంకరాపదానములలో వీరరసపరిస్ఫూర్తితో వెలసిన యీ త్రిపురాసురసంహారము, తదుపాస్యదైవతమైన లింగమే పంచారామములందు పంచలింగములై వెలయుటకు మూలమై, భీమేశ్వరపురాణమునకుఁ గావ్యత్వ మాపాదించుటలో నన్నివిషయములను మూలాధార మని తెలియవచ్చుచున్నది.

## సప్తగోదావరావతరణము.

పరమేశ్వరుఁడు త్రిపురాసురసంహారానంతరము, వారల కుపాస్యమైన లింగమును పంచఖండములుగా ఖండించి, వానిని పంచారామములందు నిలిపి, తనకు మొదలిమామగు దక్ష

ప్రజాపతి యునికిప ట్టయిన యారామం బగుటచే దక్షారామం బున శివసన్నిధానం బెదా నుండునట్లుగఁ బ్రతిష్ఠితుఁ డయ్యెను. పరమేశ్వరుఁడు దక్షారామము నందుఁ బ్రతిష్ఠితుఁ డైనప్పుడు భీమనాథునకు అర్ఘ్యపాద్యాచమనీయా ద్యుపహారములు నెఱపు టకు గోదావరినదిని గొనివచ్చుటకై భరద్వాజాదిమహామునులు తలపెట్టిరి. వా రానది నొక శుభముహూర్తమునకుఁ గొనివచ్చి యా పవిత్రజలములచే భీమనాథునకుఁ బ్రతిష్ఠచేయవలయు నను కొని, దక్షారామమునుండి రాజమహేంద్రపురమునకు శిష్యసమే తముగ వచ్చిరి.

ఆసపర్షులు గోదావరీనదిని కనులారఁ గాంచుసరికి వారికి హృదయములం దెన్నిరో పవిత్రభావము లుదయించినవి. "గౌతమీ నదిలోని నీటిని ప్రీతితో త్రాగిన మనుజులకు మఱి తల్లిచనుబాలు త్రాగవలసిన యక్కఱయుండదు. మహర్షులారా! కనుఁగొంటిరా! గౌతమీగంగ తరంగ హస్తములతో ఘుమ ఘ్వాన హుంకార ఘోషములతో పాతకసమూహమును జంకిం చుచున్నది. ఈ గోదావరమ్మ పృథివి యెల్లను రక్షించు పేరం టాలు." ఇట్లు మెచ్చుకొని యా యమ్మకు భక్తిభావము తుల కింప స్తుతినమస్కారములు చేయ మొదలుపెట్టినా రా మహ ర్షులు. ఈ ఘట్టమున శ్రీనాథుఁడు భక్తి భావముచేఁ బులకి తుఁడై పాఠకుల హృదయము పులకరించునట్లు లీ స్తుతినమస్కా రములను నెఱపినాఁడు. గోదావరిమీఁది భక్తిభావాతిరేకమున గోదావరమ్మ, గంగమ్మ యనునట్టి చనవు శ్రీనాథునకే కానవచ్చును.

"తల్లీ ! గోదావరి ! గోదావరి ! గోదావరి ! అని ముమ్మాఱు నీ నామమును స్మరించు వారికి నీవు సకలశుభములు సంపాదింతువు గదమ్మా ! నీయంబువు లసితరుచులు; అమృతోపమరుచులు; అవి మాకభ్యుదయం బిచ్చుఁగావుత." ఇట్లు ప్రార్థించి మహర్షు లా యమ్మకు నమస్కారములు నెఱపిరి.

శా. ఆ పాతాళగభీరనీరకు సుధాహారామలచ్ఛాయకున్
ద్వీపాలంకృతికిన్ మహేంద్రనగరీనిశ్శ్రేణికాయష్టికిన్
తాపోపాయవిధావిహర్త్రికి మహోదన్వద్దృఢాలింగన
వ్యాపారప్రతిపన్న సౌఖ్యకును సాష్టాంగమ్ము గంగమ్మకున్

గౌతమీనది కొన్ని తావులందు నేటికిని అంతు తెలియని లోతు గలిగియే యుండును. కార్తిక మాసమునందుఁ గలఁక దేఱిన నీటితో గోదావరి శ్రీనాథుఁడు తెలిపినట్లు సుధాహారామలచ్ఛాయమై యుండును. జంబూద్వీపమునకు నడిమి భాగమునంతటను వ్యాపించి హారముపగిది నొప్పారుచుండును. స్వర్గలోకాధిరోహణమునకు నిశ్శ్రేణిక యాపూతనది. నేటికి నీ నదీతీరమునఁ గల యగ్రహారములలో స్వర్గసాధనములయిన యజ్ఞయాగాదిక్రియా కలాపములు జరుగుచుండుట యిందులకుఁ దార్కాణము. పవిత్రమైన నదీజలము లెప్పుడును తాపము నపనయించునవియే యగును. ఈపద్యమున శ్రీనాథుఁడు గంగమ్మకు ఋషులచే నమస్కారము చేయించుచు, నాయమ్మను మహాసౌఖ్యవతినిగా జిత్రించినాఁడు. దానికి గారణ మామె మహోదధియను భర్త నెల్లపుడు గట్టిగాఁ గౌఁగిలించుకొనియుండుట. భర్త నెల్లప్పుడు నెడఁబాయకుండఁ గౌఁగిలించుకొనియుండు సతి, మహాసౌఖ్యవతి

నడకను మఱియొకవైపునకుఁ ద్రిప్పవలయును. ఈవిషయమును వ్యంగ్యముగ సూచించుటకై శ్రీనాథుఁడు "మహోదన్వద్ద్రుఢాలింగన వ్యాపారప్రతిసన్నసౌఖ్య యగు గంగమ్మకు సాష్టాంగ మ్మొనరించినాఁడు మహర్షులచేత. ఎంతగొప్పవారయినను స్తుతిపూర్వకముగా నమస్కరించిన ప్రసన్నులగుదురు కదా! అట్టి ప్రసన్నత గౌతమికిఁ గలుగుటకే యీస్తుతినమస్కారములు.

శా. రంభోరూకరశాతకుంభ ఘటధారాపూరణప్రక్రియా
గంభీరక్వణసాంద్ర భిన్నకరిరాడ్గండూషనిర్భిన్నకుశ్
సంభాషించి నమస్కరింతుము త్రిసంధ్యంబుల్ ముదంబొప్ప నీ
కంభోజాసనకుండికాఁబుజననీహంసాభ గోదావరీ!

దీనికి మూలమునం దీక్రిందిశ్లోకము గానవచ్చుచున్నది.

శ్లో. కాంతాకర స్వర్ణఘటాంబుపూర్తి
ధ్వనీభగండూష విభిన్నరూపే,
అంభోజఖేలద్వరరాజహంసే
గంగే నతాస్మో భవతీం త్రిసంధ్యం.

ఈ శ్లోమునందలి భావమును శ్రీనాథుఁ డొకకొంత పొడిగించియున్నాఁడు. కాంతలను రంభోరువులనుగాఁ జేసి, వారు బంగారుకలశములలో నీరు నించుటచే ధ్వని కొక గాంభీర్యమును జతగూర్చియున్నాఁడు. దానికి గంధగజముల గండూషములరొదను జోడించి గోదావరి కొక ప్రత్యేక విశేషము నాపాదించిపెట్టినాఁడు. వనితల కరచాలనములతోఁ గూడిన ఘటపూరణములచేతను గంధగజముల గండూషములచేతను బాయలుపాయలై నొప్పారు గోదావరికి త్రికాలములయందు నమస్కారముల నొనరింతుమని మహర్షు లామె నగ్గించినారు. మూలములో గోదావరినది

పద్మముల నడుమ రాజహంసల విహారము చే దృష్టిప్రియ మైన ది మాత్రమే. దానికొక విశిష్టమైన పవిత్రత నాపాదించుటకై బ్రహ్మదేవుని కమండలువు నందలి పద్మవనమున విహరించు రాజహంసనుగాఁ జేసినాఁడు గోదావరిని. అట్టి గోదావరికి ముద్ర మూర నమస్కరించుటలో నొక విశేషము సమకూడునుగదా?

ఇట్లే నమస్కరించి స్తుతించి, యావెనుక నా యమ్మను దమ వెంట రమ్మని ప్రార్థించియున్నారు. ఈప్రార్థన గోదావరీ ప్రవాహము వలె సరసమధురముగను, భావగంభీరముగను నడచినది. ఈస్తుతి హృదయమును ద్రవింపఁజేయు మధురతరఘట్టము. గోదావరీనదీసౌందర్యము నంతయు నీ పద్యమునందు కన్నులకుఁ గట్టినట్టులు చిత్రించినాఁడు. భీమేశ్వరపురాణమున కీ సీసము నాయకమణి అనవచ్చును. కనుఁడు:—

సీ. విచ్చేయుమమ్మ శ్రీవృషభవాహన శిర
స్స్వమజ మదకటాసారధార!
పయనంబుగావమ్మ భర్గజటాటవీ
కుటజశాఖాశిఖాకోరకంబ!
రావమ్మ యాదిమబ్రహ్మదోః పల్లవ
స్థితకమండలు పుణ్యతీర్థజలమ!
లేవమ్మ విశ్వంభరా వధూటీకంఠ
తారమౌక్తిక హారదామకంబ!
తెరలతో బిబికలతోడఁ దరులతోడ
విమలడిండిరఖండతండములతోడ
మురువు శీవియు నామోదమును జవంబు
వడువు నొప్పంగ గంగమ్మ నడువవమ్మ. భీమ. ౪-౧౩౨.

ఈ యాహ్వానమునందు వినయము తొణికిసలాడుచున్నది. హర శిరస్సంభూతయగు గంగనుగా గోదావరిని భావించి, పరమేశ్వరుని సామవేదోద్భవమగు మత్తగజముగను, నదీప్రవాహమును తన్మపధారగను నారోపము చేసియున్నాఁడు. అట్టిగంగమ్మను దనువెంట విచ్చేయుమని ప్రార్థించినా రామహర్షులు. పరమేశ్వరజటాజూట మనువనమునఁ బొడమిన కొండమల్లెమొగ్గయైన యాజననిని బయనంబు గమ్మనినారు. ఆదిమబ్రహ్మ కరపల్లవమునఁ దాల్చిన కమండలువునందలి పుణ్యతీర్థోదకమా! రమ్మని యాహ్వానించినారు. భూరమణికంఠదేశమునకు ముక్తాహారమై వెలయువానా! లేవమ్మ యని వేగిరించినారు. వచ్చునప్పుడు నీ యొయ్యారపువపువు గానవచ్చునట్టులు చిన్న యలలు పెద్దతరఁగలు తెల్లనినురుగుముద్దలు వెంటఁగొనుచు మురువు తీవి ఆమోదము జవము నొప్పఁగ నడువుమని నివేదించియున్నారు.

ఈ విజయవత్సరమున నొక్కమాఱు గోదావరి యీ పద్యము నందలియార్భటితో త్ర్యంబకాచలశిఖాగ్రమునుండియు బయలుదేఱి, రాజమహేంద్రవరము వఱకు వచ్చి, యచటనుండి సప్తశాఖలు నేకమై తరంగహస్తములతో సముద్రుని కౌఁగిలించినది. ఇట్లాగౌతమిని వినయ ప్రణయములతో వేడుకొని మహర్షులు కర్తవ్యము నిట్టులు వెలిఁబుచ్చినారు.

మ. అదె మాస్వామి సుధారసోద్భవుఁడు దక్షారామభీమేశుఁ డ
భ్యుదయుం జెంది ప్రతిష్ఠ నైకొనెడు నంభోరాశితీరంబునం
బదమా! షట్పదమాలికాపరిలసత్పాథోధునీసంపదా
స్పదనానా సలిలప్రవాహలహరీసంభార గోదావరీ! ౪-౧౭౬

ఈ భీమేశ్వరపురాణమునందే మఱియొకతావున శ్రీనాథుడు గోదావరిని వర్ణించుచు గౌతమీగంగ సప్తసముద్రములకు వలపువనితయైన మంగళోత్సంగ యనినాఁడు.

గీ. నీరుకడఁ గోళ్ళఁగూడి మున్నీటిఁ గవయు
మొగులుంబడివాహినుల కెల్లు మెరయవచ్చు
వార్ధులేడింటికి వలపు వనితయైన
మంగళోత్సంగ గౌతమీగంగయొకర.

ఈ ప్రసంగముననే గోదావరి నాసికసమీపమున నున్న త్ర్యంబకాచలము నుండి బయలుదేఱి క్రమముగా నార్యావర్తము మీఁదుగా తూర్పు సముద్రమునకుఁ జేరినతీరు నొక పద్యమున రేఖాచిత్రమును దీసినాఁడు.

సీ. త్ర్యంబకాచలశిఖాగ్రంబునం దుదయించి
పొదలి యార్యావర్తభూమి దఱిసి
మలఁగి దండకవనీమధ్యభాగమున నా
ప్రస్రవణాచలప్రస్థ మొఱసి
పట్టిసశ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథుమందిరము డాసి
ఏచి యనంతభోగేశ్వరస్థానంబు
రుదగ్రిపాదములపైఁ ద్రోవగాఁగఁ
గోటిపల్లీశుకోమలాంఘ్రులకు మ్రొక్కి
కుండలాముఖతీర్థంబు గుస్తరించి
భీమమండలి డాపలఁ బెట్టికొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె. ౩-౭౧

గౌతమినది త్ర్యంబకాచలశిఖరమునుండి బయలుదేఱి, ఆర్యావర్తభూమిని సమీపించి, దండకారణ్య మధ్యభాగమునుండి వచ్చుచు

ప్రస్రవణాచలము నొరసికొనినది. ప్రస్రవణ మనఁగా పాపిడి. ప్రస్ర వణాచల మనఁగా పాపిడికొండ. దాని నీనాఁడు పాపికొండ యం దురు. గౌతమీ ప్రవాహము దండకారణ్యమధ్యమునందు భద్రా చలము మీఁదుగా వచ్చుచుండ నడుమ నడ్డమువచ్చిన కొండ పాపిడిపెట్టుగాఁ జీలిపోయినది. దానినే పాపిడికొండ యనెడివారు. ఈనాఁడు 'డి'కి చ్యుతి యేర్పడి పాపికొండగా వ్యవహార మేర్పడి నది. దానికి మఱికొంత క్రిందికి వచ్చునరికి పట్టిస శ్రీవీరభద్రే శుఁడు. పట్టిసమునం దుండెడి వీరభద్రేశ్వరుఁడు. ఇది రాజమ హేంద్రవరమున కాఱుక్రోసులదూరమునం దున్నది. అచట నెల కొనిన యీశ్వరుఁడు వీరభద్రేశ్వరుఁడు. ఈస్వామి యాలయము గౌతమీ ప్రవాహమధ్యమునం దున్నది. ఈ పట్టిస వీరభద్రేశ్వ రుఁడు నీ ప్రాంతమందు ప్రసిద్ధమైన పరమేశ్వరమూర్తులలో నొకఁడు. నేఁటికి నీ యీశుఁడు శివరాత్రినాఁడు నలుజాములు వేదవచనములు వినుచుండును. గోదావరి యీ పరమేశ్వరు నా నాఁడు నీనాఁడును సేవించుచునే యుండును.

తిలసోమనాథుఁడు:— ఈ స్వామి పట్టిసమునకుఁ గ్రిందుగ రెండుక్రోసుల దూరమునందున్న 'తాళ్ళపూడి' యను గ్రామ మున నెలకొనియున్నాఁడు. ఈ పరమేశమందిరము గౌతమీ నదీ తీరమునందుఁ గలదు.

అనంతభోగేశ్వరము:— అనంతభోగేశ్వరుఁడు నెలకొనిన స్థానము. శ్రీనాథుని కాలమునందు సైత మీ యీశ్వరుఁడు గౌతమీనదీ తీరమం దుండియుండును. ఈ నాఁ డనంతభోగేశ్వ రుఁడు కుమారదేవ మనుగ్రామమునందు స్థిరపడినాఁడు. ఇంతకు ముందు నదీతీరమునం దాలయ ముండినట్టులు నదీపతితము లైన శిథిలములు కొన్ని యీనాఁటికిని గానవచ్చును. నేఁటికిని గల్యా

ణమంటపము నదిలోఁ గానవచ్చును. ఈ యనంత భోగేశ్వరస్థానము తిలసోమనాథుని మందిరమునకుఁ గ్రింద రెండు క్రోసుల దూరమునఁ గలదు.

రుద్రపాదములు:— రాజమహేంద్రవరమున మార్కండేయస్వామి నెలకొనియున్న అద్రి కమలాద్రి, లేక పుష్పగిరి. ఆ పుష్పగిరి పాదములు రుద్రపాదములు. యేపాటి పొంగినను నాటికి నేఁటికి నీ మార్కండేయస్వామి చరణములు (రుద్రపాదములు) సేవించుచునే యుండును. ఈ పరమేశ్వరుఁడు భీమనాథున కిరుగు పొరుగుల వారిలో నొకఁడై పశ్చిమ సీమ నందు నెలకొనియున్నాఁడు. ఈ రుద్రపాదములను కృత్యాదిలో శ్రీనాథుఁ డీతీరున వివరించియున్నాఁడు.

సీ. కమలాచలాగ్ర మార్కండేయ శిఖర
శృశిచంద్ర కాధాత సౌధవీథి
గోదావరీపుణ్య కూలంకషాజల
ప్లావిత శ్రీరుద్రపాదయుగళి
గీ. ...సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము. ౧-౪-౨

ఈ రాజమహేంద్రవరమున కెదురుగ నుండిన కొవ్వూరును గోపాదక్షేత్ర మని యందురు. గౌతమమహర్షి గోవును జంపిన పాపము నివర్తించుటకై యీశ్వరునిగూర్చి తప మాచరించి, త్ర్యంబకాచలము నుండి గోదావరీనది నీ తావునకుఁ దెచ్చి గోవు నుత్తమలోకములకుఁ బంపుటచే నీక్షేత్రమునకు 'గోపాదక్షేత్ర' మనుపేరు వచ్చె నని గౌతమీ మాహాత్మ్యమునందలి యైతిహ్యము. రాజమహేంద్రవరమునకు దక్షిణముగ రెండు క్రోసుల దూరమున ధవళగిరి (ధవళేశ్వరము) గలదు. దానిని 'రామపాద క్షేత్ర' మని యందురు. పలివెల కొప్పులింగేశ్వరస్వామి యాల

యమున నెలకొనియున్న అనితల్లి శాసనములో "గౌతమీమహా నదీతీరమందును మార్కండేశ్వర మృకండేశ్వరు రుద్రపాదాలసన్నిధిని" అని యున్నది. దీనినిబట్టి మార్కండేయస్వామి వసించిన కమలాచల చరణములే రుద్రపాదములని తెలియవచ్చుచున్నది. ఈ స్థానమునుండియే గోదావరి సప్తశాఖలుగఁ జీలి సముద్రమునఁ గలిసినది. రాజమహేంద్రవరము వఱకు గోదావరిని అఖండగౌతమి యని యందురు.

శ్లో॥ తుల్యాత్రేయీ భరద్వాజీ గౌతమీ వృద్ధగౌతమీ
కౌశికీచ వసిష్ఠాచ సప్తశాఖాః ప్రకీర్తితాః.

తుల్యానది: గౌతమీనది రాజమహేంద్రవరమునుండి దక్షిణముగాఁ బ్రవహించుచు ధవళేశ్వరమునుండి యొకశాఖ గౌతమి యనుపేరను, విఘ్నేశ్వరమునుండి మఱియొకశాఖ వసిష్ఠానదిగను వేఱయినది. ఈ గౌతమీ శాఖనుండియే విడువడి — తుల్యా, అత్రేయి, భారద్వాజి, గౌతమి, వృద్ధగౌతమి, కౌశికి — యను నాలుశాఖ లేర్పడినవి. వీనిలో తుల్యానదీశాఖ ధవళగిరికి ముందు నుండి వెలువడినది. ఈనాఁడా శాఖాముఖ మొక పాడుపడిన కాలువగా, రాజమండ్రినుండి ధవళేశ్వరము పోవునపుడు గ్రామారంభమునఁ గానవచ్చును. ఈ శాఖ ధవళేశ్వరమునుండి బయలుదేఱి కడియము అనపర్తి తాపేశ్వరము మావిడాడ వేళంగి సంపర మున్నగు గ్రామములమీఁదుగఁ బ్రవహించి కాకినాడ సమీపమున చొల్లంగి యనుచోట సముద్రగామి యగుచున్నది. ఈనదీ సాగరసంగమస్థానమున సోమేశ్వరుఁడు ప్రధానుఁడై నెలకొనియున్నాఁడు. ఇచటనే ఆంజనేయస్వామియుఁ గలఁడు. పుష్యబహుళ అమావాస్యనాఁడు అర్ధోదయ మహోదయాదిపర్వములం దీనదీ

సాగరసంగమమున స్నాన దానాదులు మహాపుణ్యాదము లని పెద్దలు వాక్రొందురు.

ఆత్రేయీనది :— గౌతమీశాఖ నుండియే తుల్యానది విడువడిన ధవళేశ్వరమునకుఁ దరువాత కోటిఫలికి రెండుక్రోసులు క్రింద నొకశాఖ విడువడినది. దానిని ఆత్రేయి యందురు. ఇది యీ నదీతీరమున రామఘట్టమున నావిర్భావము నంది, కోరంగి యొద్ద సాగరసంగత మైనది. ఈ సాగరసంగమస్థలమున కురంగేశ్వరుఁడు గలఁడు. శ్రీరాముఁడు కురంగము నీ చోటఁ జంపుటచే నిచట ప్రతిష్ఠితుఁడైన యీశ్వరునకుఁ గురంగేశ్వరుఁ డను పేరు వచ్చినదని యైతిహ్యము.

భరద్వాజి—గౌతమి:— ఈ భారద్వాజి యను శాఖ ఇప్పుడు "అక్విడెక్టు" కట్టిన 'అన్నంపల్లి' యను చోటినుండి విడువడి ఇంజరము వఱకుఁ గానవచ్చుచు గౌతమీశాఖలో గలసి యానాము (ఫ్రెంచినగరము) మీఁదుగా సముద్రమునఁ గలియుచున్నది. ఈ మధ్యభాగమున నీనదిని 'భారద్వాజ్యంతర్భూతగౌతమి' యని వాక్రొందురు. ఈసాగరసంగమ క్షేత్రమును 'తీర్థాలమొండి' యందురు. ఇచట గౌతమి భాదద్వాజి రేవ అహల్య ? ఇంద్ర యను పంచతీర్థములు గూడిన వనియు కావున దీనికి తీర్థాలమొండి (మొగ) యను పేరు వచ్చినదని తెలుపుదురు. ఇచట నీశ్వరుఁడు భైరవేశ్వరుఁడు. ఇచట భైరవపాలెము అను బెస్తపల్లె యొకటి గలదు.

వృద్ధగౌతమి:— ఈశాఖ గౌతమీనదికి పశ్చిమతీరము నుండి వెలువడినది. దీనియుత్పత్తి యెచ్చటనో స్పష్టముగఁ దెలియదు. కౌశికినది పుట్టినచోటనే పుట్టినదేమో? ముక్తేశ్వరము

మొదలు శానపిల్లంక తాణేలంక గేదెల్లంక క్రొత్తలంక కుండలే
శ్వరము అను గ్రామముల స - పమునందున్న మురికికాలువను
వృద్ధగౌతమి యందురు. ప్రభుత్వము ఈ నదీముఖములను గప్పి
వేసినను దీనిని "వృద్ధగౌతమీడ్రైను" అను పేరితోడనే నేఁడు
వ్యవహరింతురు. ఇది సాగరమునఁ గలసినచోట వృద్ధేశ్వరుఁ డుండె
డివాఁడని వినికి. ఈనాఁడాలయమును లింగమును సముద్రపతిత
ములు. అచట బ్రహ్మేశ్వరునిలింగము గలదు. సంతానగోపాలే
శ్వరస్వామియు అరిష్టమ్మ యను నమ్మవారును గూడఁ గలరు.
దీనికి బ్రహ్మసంవేద్యము అని పేరు. సంతానప్రాప్తికై సప్తసాగ
రయాత్ర చేయువారు ఈ స్వామియెదుట నిద్రింతురు. వారికి
స్వప్నములు వచ్చుటయు, స్వప్నానుసారముగ సంతానఫలమును
బడయుటను గలుగునని చెప్పుకొందురు. ఈ క్షేత్రము నీనాఁడు
'బ్రహ్మసమేధ్యము' అని యందురు.

కౌశికినది:____ గౌతమీనదిపశ్చిమ శాఖనుండి యీనది
'మందపల్లి' (అగస్త్యప్రతిష్ఠితుఁడగు మందేశ్వరుఁడు నెలకొనిన
చోటు) సమీపమునఁ గల 'సూర్యకుండము' అనుచోటినుండి
విడువడి అమలాపురము, తాలూకాలోని గ్రామములన్నియుఁ
జుట్టుచు 'బెండమూర్లంక' యనుచోట సాగరమునఁ గలియు
చున్నది. ఈ ప్రదేశమును 'విష్ణుసంవేద్యము' అని యందురు.
ఇది బ్రహ్మసంవేద్యమునకు నాలుగుక్రోసుల దూరములో నున్న
ది. ఇచట రామలింగేశ్వరస్వామియును లక్ష్మణేశ్వరస్వామియును
గలరు. ఈ కౌశికీనదికి కౌంతేయి యను పేరును గలదు. 'పలివె
ల' కొప్పులింగేశ్వరుఁ డీనదీతీరమునఁ గలఁడు. ఈ నది ప్రవహిం
చిన చోటునంతను 'కోనసీమ' యందురు.

ఈ కౌశికీనది పుట్టినచోటునకుఁ బశ్చిమముగ గౌతమీ నదిలో నుండి యొకశాఖ విడువడి, యది యాత్రేయినది పుట్టి నచోట మరల గౌతమీలోఁ గలిసినది. దీనిని కణ్వానది యందురు. ఈ నాఁడిది ప్రభుత్వము వారి లెక్కలలో 'టేకిడ్రైను' అని వ్యవహరింపఁబడుచున్నది. ఈ విజయ సంవత్సరమున గోదావరి యుప్పొంగి వరదలై ప్రవహించినపుడు ఈ నదీముఖములయొద్దనే గళ్ళు పడినవి. తుల్యానదీముఖమున ధవళేశ్వరము దగ్గఱను, కౌశకీనదీముఖమున మందపల్లియొద్దను, కణ్వానదీముఖమున కపిలేశ్వరపురమునొద్దను, ఆత్రేయినదీముఖమున పిల్లంక యొద్దను, భారద్వాజి ముఖద్వారమున పశువుల్లంకయొద్దను నదీశాఖా ముఖములు తెఱచుకొని సప్తశాఖలు సేకమై తరంగహస్తములతో సముద్రుని గౌఁగలించినది. గోదావరికిఁ బడిన, గళ్ళన్నియు సరిగా నదీముఖములందే పడుట యొక యద్భుత విషయము.

వసిష్ఠ:—ఇది కొవ్వూరునకు క్రోసుదూరముక్రింద విఘ్నేశ్వరము నొద్ద గౌతమినుండి విడువడి సరాసరిగాఁ బోయి అంతర్వేదియొద్ద సముద్రగామి యైనది. అచట నీలకంఠేశ్వరుఁడు నృసింహస్వామియుఁ గలరు. ఇది యొక గొప్ప పుణ్యక్షేత్రము. మాఘశుద్ధపాడ్యమినాఁడు చొల్లంగినుండి బయలుదేఱి, సప్తగోదావరీశాఖాసంగములలో స్నానముచేయుచు మాఘశుద్ధ ఏకాదశివఱకు సప్తసాగరయాత్ర చేయువారీ అంతర్వేదికిఁ జేరుదురు. అచట నా యేకాదశికి గొప్ప తీర్థము (తిరునాళ్ళు) నేఁటికిని జరుగుచుండును.

ఈ విధముగ గోదావరి యేడుశాఖలై ప్రవహించి సముద్రగామియైనను, భీమమండలి యీసప్తశాఖలనడుమనే యున్నది. ఈ భీమమండలి నడుమనే భీమేశ్వరుఁడు పుండరీకమధ్యమున రాజహంసమువలె ప్రతిష్ఠ నందినాఁడు. ఆ దృశ్యమును శ్రీనాథుఁ డెంతయు మధురముగఁ జిత్రించియున్నాఁడు.

సీ. ఆంధ్రభూభువనమధ్యము పుండరీకంబు
సప్తగోదావరజలము తేనె
బ్రహ్మసంవేద్యాది బహుతీర్థములు రేకు
లకరులు చారుదివ్యస్థలములు
నాళంబు లవణాబ్ధివేలావిభాగంబు
కల్యాణభోగమోక్షములు తావి
దక్షవాటీమహాస్థానంబు కర్ణిక
హంసంబు భీమనాయకుఁడు శివుఁడు
గౌతమీసింధు కాంతేయకణ్వనదులు
తుల్యభాగయు నేలేరు దుమ్మికొనలు
భువనసంభావ్యమైన యీపుణ్యభూమి
యనఘ సంసారతాపశాంత్యౌషధంబు
భీమ. 3-౨౧

ఇట్టి పుణ్యనదీశాఖలు, దత్తీరముల దివ్యమూర్తులయిన యీశ్వరలింగములు నెలకొనియుండిన కారణముననే భారతదేశమంతటిలోను గోదావరీనదీతీరము పరమపావన మని యితరదేశస్థుల నమ్మకము. ఇతరనదులకంటె నీ గోదావరి విలక్షణముగ సప్తశాఖలతో సముద్రుని గౌఁగిలించినది గావున నీ నదీమహత్త్వ మితరనదులకంటె ప్రశస్తతర మని శ్రీనాథుఁడే వివరించినాఁడు.

నీరుకడఁ గోళ్లఁగూడి మున్నీటిఁ గలయు
మొగలు జడివాహినుల కెట్లు మొరయవచ్చు

వర్ధులేడింటికి వలపు వనితయైన
మంగళోత్సంగ గౌతమీగంగ యొదుగ.

ఈ తీరుగ శ్రీనాథుడు గౌతమీగంగను వార్ధులేడింటికిని వలపు వనితనుగాఁ జేసి మంగళోత్సంగను జేయుటయం దాతని కవితా శిల్పము ప్రతిఫలించి పురాణమును రసబంధురకావ్యబంధముగా వెలయించినది.

## భీమేశ్వరపురాణము—శాసనప్రామాణ్యము.

శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమునందుఁ గృష్ణాగోదావరీ మండలములకు మధ్యనుండు నాంధ్రదేశమునకు సంబంధించినంతవఱకుఁ దననాఁటి దేశచరిత్రమును గొంత తెల్లముచేసినాఁడు. ఆతఁ డందుఁ దెలిపిన యంశములను దార్కాణించు తామ్రశిలా శాసనములు పెక్కులు మన కీనాఁడు గానవచ్చుచున్నవి. భీమేశ్వర పురాణము రచించునాఁటికి శ్రీనాథుఁడు పెదకోమటి వేమారెడ్డి యాస్థానమున విద్యాధికారియై పెక్కుశాసనములు రచించియుండెను.[1] గావున, భీమేశ్వరపురాణమునకుఁ గృతిభర్తయైన బెండపూఁడి అన్నామాత్యునిఁ గూర్చియు, ఆతని కేలిక లయిన వేమవీరభద్రారెడ్లను గూర్చియుఁ దెలిపిన చారిత్రకవిషయము లన్నియు శాసనసంబద్ధములై మనకిపు డుపలబ్ధము లగుచున్నవి. శ్రీనాథుఁడు కొండవీడునందును రాజమహేంద్రవరమునందును రెడ్డిరాజులప్రాపున నుండినపుడు రచించిన కావ్యములలో, నాయా ప్రభువుల యశఃప్రసక్తుల నుగ్గడించినాఁడు. ఆతఁడు దెలిపిన యంశములను దార్కాణించు శాసనాధార

1. చూ. విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః
ఆకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం.
Epigraphia Indica Vol XI శివరంగపురము శాసనము.

ములు పెక్కులు గానవచ్చుటచే, రెడ్డిరాజుల పరిపాలనకాలనిర్ణయమునకును, నాఁటి సారస్వతాభివృద్ధి నిదర్శనమునకును శ్రీనాథుని ప్రబంధము లెంతయుఁ దోడ్పడినవి. చరిత్రకారు లెందఱో శ్రీనాథుని కృతుల నూఁతగఁగొని, యానాఁటి చరిత్రమును దెలిపియే యున్నారు. భీమేశ్వరపురాణమునందు శ్రీనాథుఁడు పేర్కొనిన కొన్ని యంశములను దీసికొని, వానికిఁ గల శాసన ప్రామాణ్య మెట్లుండెనో? కొంత నిరూపించెదను.

ఈకావ్యమున భీమేశ్వరుని మాహాత్మ్యము నుగ్గడించుచు పంచారామములలో దక్షారామము, పరమేశ్వరుని మొదటి మామయగు దక్షుని యావాసమై యత్యుత్తమ మగుటచే నచట పరమేశ్వరుఁడు స్వయముగ నావిర్భవించె నని తెలుపుచుఁ బంచారామముల నిట్లు వర్ణించియున్నాఁడు.

వ. అంబికావల్లభుండు త్రిపురదైత్యుల కులదైవతంబైన య దివ్య లింగంబును బంచఖండంబులుగా ఖండించి, కృష్ణవేణీ మహానదీతీరంబున ధరణాలకోట యను గ్రామంబున నమరేశ్వరుని చేతం బ్రతిష్ఠితం బగుటంజేసి యమరలింగంబునాఁ బ్రసిద్ధంబైన యమరారామంబును, గౌతమీతీరంబున దక్షిణకూలంబున గుణపూఁడి యను గ్రామంబున సోమునిచేతఁ బ్రతిష్ఠసేయంబడుటం జేసి సోమలింగం బనఁ బ్రఖ్యాతంబైన సోమారామంబును, బాలకోటనాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబును, చాళుక్యవంశరాజధాని యగు చాళుక్యభీమవర నామ గ్రామంబునఁ గుమార రత్నంబైన కుమారస్వామిచేఁ బ్రతిష్ఠితంబగుటం జేసి కుమార భీమలింగం బనఁ

ప్రఖ్యాతినొందిన భీమారామంబును, మొదలిమారామ యునికి పట్టయిన యారామం బగుట దక్షారామంబున శివసన్నిధా నంబై దా నుండునట్లుగా...దక్షవాటంబున...భీమేశ్వర లింగంబునం దధివసించె. భీమ. ౪. ౧౪౧

ఈ పంచారామములకు సరిపడునామము లీక్రింది శాసన పద్యములోఁ గానవచ్చుచున్నవి.

సీ. భీమాపురము దాక రేమియు (న) మాడాలు
గుడిపూండియుం బాలకొలన వీర
భద్రేశ్వరంబున బావపట్టునఁ దాంబ్ర
పురిం బి(ద) పురమునం బరంగు మూఁ
ఘంటశాలాపురిం గొతరంబునను సే
లీశ్వరంబునను వేగీశ్వరమున
విజయవాటిక నుండవిల్లిని వేలుపూరం
గర మొప్పు గొంటూరం గడలిపల్లి
కనకవలయములును ఘనలోహదగరండ
ములు నఖండదీపములునుం బెట్టి
మ(ఱ)లం బెక్కు గుళ్లుం జెలువులు గొంటూర
నిలిపె మం(త్రి) మ(తి)ంపుభుజుండు

శా. భారద్వాజపవిత్రగోత్రు(ం)(డు) జగత్ప్రఖ్యాతి గాం బెట్టెం బు
ణ్యారంభుం డొరిగాంఢి వల్లభుండు దత్తామాత్యసోముండు దా
క్షారామప్రముఖోల్లస త్ప్రకట పంచారామతీర్థంబులన్
సారాఖండవశాస్త్ర దీపకము లాచంద్రార్క తారంబు గాన్.

ఈ శాసనము రాజమహేంద్రవరము చిత్రవస్తుప్రదర్శనశాలలోని గిడ్డంగిలోఁ బడియున్నఱాతి స్తంభముమీఁదఁ జెక్కఁబడియున్నది, శక. సం.౧౦౭౧—అనఁగా క్రీ. శ. ౧౧౪౯ నాఁటిది. దత్యాపెగడ

సోమన పట్టిసమున వీరభద్రేశ్వర మహాదేవరకు అఖండదీపము పెట్టినప్పు డీశాసన మేర్పడినది.[2] ఆనాఁడు సుకృతము నపేక్షించు వారు పంచారామ క్షేత్రములందును తదితరదివ్యస్థలములందును నఖండదీపదానములు చేయుచుండెడివా రని యీ శాసనము మనకుఁ దెలుపుచున్నది.

ఇందు మొదటి సీసపద్యములోఁ బేర్కొనిన—'భీమాపురము' అనఁగా నేనాఁటి సామర్లకోట భీమవరము. దీనికి కుమారారామ మనియు స్కందారామ మనియు నామములు శాసనములలోఁ గానవచ్చుచున్నవి.[3] ఇచటి యీశ్వరుఁడు భీమేశ్వరుఁడు. ఈభీమవరము చాళుక్యభీమునకు రాజధానియై యుండుటచే దీనికి భీమవరము, చాళుక్య భీమవరము, చాళుక్యభీమాపురము, అనునామము లచటి భీమేశ్వరాలయమున నెలకొని యున్న పెక్కు శాసనములందుఁ గానవచ్చుచున్నవి. అక్కడి శాసనములలోనే వేఱొక దానిలో 'చాళుక్యభీమావీరమున' అని కూడఁ గానవచ్చుచున్నది.[5] ఈవిషయము లన్నియు సందర్భించునట్టులు శ్రీనాథుఁడు ఈ కుమారారామమును గూర్చి యెత్తిఁగించుచు "చాళుక్యవంశరాజధాని యగు చాళుక్యభీమవర నామ గ్రామంబునఁ గుమారరత్నంబైన కుమారస్వామిచేతం బ్రతిష్ఠితం బగుటంజేసి కుమారభీమలింగం బనఁ బ్రఖ్యాతినొందిన

---

2. చూ. శాసనపద్యమంజరి—ద్వితీయభాగము. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము. పుట ౧౦(A. R. 40 of 1942.)

3. చూ. దక్షిణహిందూస్థాన శాసనసంపుటము. (South Indian Inscriptions) Vol V No 36.

4. చూ. S. I. I. Vol V No 49, 68, 82, 90.

5. చూ. S. I. I. Vol V No 92

భీమారామంబును"-అనినాఁడు. ఈ యాలయమునందలి కొన్ని శాసనములలో నచటిభీమేశ్వరునకు "చాళుక్య భీమేశ్వరుఁడు" అను నామము గైకొనఁబడినది [6]. ఈ విషయమునుసైతము శ్రీనాథుఁడు భీమఖండ మీక్రింది పద్యములలో,

మ. సరిసామంతుఁడు శ్రీకుమారవనికా చాళుక్యభీమేశ్వరే
శ్వరదేవుండు......" భీమ. ౨. ౮౬

సీ. అదె కుమారారామ మాహాత్మ్యరేఖయ
చాళుక్యభీమేశు సదనవాటి. భీమ. ౩. ౭౨

అని వివరించియే యున్నాఁడు. కుమారారామ భీమేశుఁడు చాళుక్యభీమనగరసమీపమున నుండుటచేతనే చాళుక్యభీమేశుఁడైనాఁడు. "చాళుక్యభీమనగరీవిహితాస్పదాయ" అను శాసన శ్లోకవిషయ మిందుల కుపోద్బలకము.

2. ఇఁక 'డాకరేమి' యనఁగా దాక్షారామము. దాక్షారామ భీమేశ్వరాలయమునందలి శాసనములలో సంస్కృతపదముగా వ్యవహరింపఁబడినపు డీపదము దక్షారామము లేక దాక్షారామము అని పేర్కొనఁబడినది [7]. ఇఁక నచటి శాసనములలో తెలుఁగుపదముగా వ్యవహరింపఁబడునపుడు 'పెద్దదక్షరేమి, పెద్దడాకరేమి, డాకరేమి' యని పలుతావులందుఁ గానవచ్చుచున్నది [8]. మఱియుఁ గొన్ని శాసనములలో "దక్షతపోవనే స్థితవతే భీమేశ్వరాయ" అనియుఁ గలదు. అనఁగా దక్షుని తపోవనమున (దక్షారామమున) నెలకొనిన భీమేశ్వరున కని

---

6. చూ. S.I.I.Vol.V No 46.
7. చూ S.I.I.Vol. IV No 1021, 1031, 1040, 1050, 1051.
8. చూ S.I.I.Vol. IV No 1020,1326,1015,1016,1102,1104.

యర్థము. దీనినిబట్టి 'డకరేమి' యను పదము 'దక్షారామ' పదమునకును, 'డాకరేమి' యనుపదము 'దాక్షారామ' పదము నకును వికృతిరూపములుగాఁ గానవచ్చుచున్నవి. శ్రీ సూర్యా రాయాంధ్రనిఘంటువులోఁ గూడ 'డాకరేమి' అను పదము 'దక్షారామ' పదమునకు వికృతిగాఁ దెలిపియున్నారు. ఈనాఁ డాపరిసరములం దాగ్రామమునకు 'ద్రాక్షారామ' మను పేరుండి నను. 'డాకరేమి' యను పదము 'ద్రాక్షారామ' పదమునకు వికృతిరూపము గానేరదు. ముద్రితమైన దాక్షారామ భీమేశ్వ రాలయమునందలి 380 శాసనములలోను ఒక్క శాసనమునందు మాత్రము 'ద్రాక్షారామమున' అని కానవచ్చుచున్నది [9]. ఇది యును లేఖకప్రమాదమే కావచ్చును. ఉన్న శాసనములన్నిటిలో 'దక్షారామము' 'దాక్షారామము' అనియే యుండ నది 'ద్రాక్షా రామ' మెట్లు కాఁగలదు?

3. 'అమాడాలు' అనుచోట—'అమరడాలు' అని చదువవలెను. అమరడాలు—అనఁగా నేఁడు 'అమరావతి' యను పేర వ్యవహరింపఁబడు అమరారామము, అమరారామము, ధాన్యవాటి, ధాన్యకటకము, ధరణికోట, దరణకోట అను నీ పదములు ఆ యమరేశ్వరాలయము నందలి శాసనములలో సమానార్థకములుగా వ్యవహరింపఁబడినవి. కృష్ణవేణీనదీతీరమున ధాన్యకటకపురిని అమరేశ్వరునిచేఁ బ్రతిష్ఠితుఁడైన యీశ్వరుఁడు అమరేశ్వరుఁడు. అతఁడు నెలకొనినచోటగుటచే నది 'అమరా రామమై' శాసనములలోఁ గొన్నిట 'నమరడాలై' ఇప్పు డమ రావతి యైనది. ధాన్యవాటియే అమరావతి యైన దనుటకు

9. చూ. S.I.I. Vol. IV No 1043.

"శ్రీమతు వేమనంగారు శకవర్షంబులు ౧౨౮౩ అగు ప్లవసంవత్సర శ్రావణ బ ౫ గు ... పంచారామంబులకుఁ బ్రథమారామంబై న అమరారామం బను ధాన్యవాటిపురంబునకు అధీశ్వరుండై న అమరేశ్వర శ్రీమన్మహాదేవరకు" అను అమరావతిలోని యమరేశ్వరాలయ శాసనము నిదర్శనము[10]. మఱియు నీయమరేశ్వరాలయమునందలి శాసనములలో '(ధాన్యవాటి నవ్యాలేశు ...దన్నలకోట అమరేశలింగముఁ ధాన్యకటక పురాధీశ్వర ...అమరేశ్వరమహాదేవర" అని కానవచ్చుచుండుటచేఁ పై పదములన్నియు పర్యాయములే యగును[11]. కావుననే శ్రీనాథుఁడమరారామమును గూర్చి శాసనములందలి విషయములకు సరిపడునటుగా "కృష్ణవేణీ మహానదీతీరంబున దరణాలకోటయను గ్రామంబున నమరేశ్వరునిచేతం బ్రతిష్ఠితం బగుటంజేసి యమరలింగంబునాఁ బ్రసిద్ధంబై న యమరారామంబును" అని వివరించియున్నాఁడు. కృష్ణవేణీ నదీతీరమున శ్రీశైలము తరువాతఁ బ్రసిద్ధమైన శైవక్షేత్ర మీ యమరారామమే. ఇది ప్రాచీన కాలమున బౌద్ధులకుఁగూడఁ దీర్థరాజమై వెలసినది. కావుననే యీ ధాన్యకటకమునందలి యమరేశ్వరాలయ సమీపమున బౌద్ధస్తూపములు శాసనములుకూడ నెలకొనినవి.

4. గుడిప్రాండి యనఁగా పశ్చిమగోదావరి జిల్లాలో నుండిన నేఁటి గుణుప్రూఁడి భీమవరము. ఇచటి యీశ్వరుఁడు సోమప్రతిష్ఠితుఁడై న సోమేశ్వరుఁడు; గావున దీనిని సోమారామమనినాఁడు శ్రీనాథుఁడు. మఱియు పై శాసన పద్యమునందలి

---

10. చూ. S.I.I. Vol VI No 226.

11 చూ. ,, ,, No 227, 228, 231, 248

విషయమునకు సమ్మతి యేర్పడునట్లు "గౌతమీతీరంబున దక్షిణ కూలంబున గుణపూండి యనుగ్రామంబున సోముపిచేతం బ్రతిష్ఠ చేయంబడుటంజేసి సోమలింగం బనం బ్రఖ్యాతంబైన సోమారామంబును" అని గుణపూండిని స్మరించినాఁడు. గౌతమీనదీతీరమున కిది దక్షిణముగ నుండెననియు నీనూఁదిగ్విభాగము ను కూడ నెఱపియున్నాఁడు.

5. పాలుకొలను-అనఁగా పశ్చిమగోదావరిజిల్లాలో నేఁడు 'పాలకొల్లు' అని వ్యవహరింపఁబడు గ్రామమున దీనికి సంస్కృతమున 'క్షీరారామ' మని పేరు. ఈ క్షీరారామ రామేశ్వరుని దేవాలయమున నెలకొనిన శాసనములు పెక్కింటిలో 'పాలుకొలని క్షీరారామేశ్వర శ్రీ మహాదేవరకు" అని గలదు[12]. ఇంక భీమేశ్వరపురాణమునందలి "పాలకోట నాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబు" అను పాఠము సరిపడలేదు, 'పాలకోట' అనునది ముద్రితప్రతియందలి పాఠము. తాటియాకు ప్రతిలో "పాలకొలనన" అనుపాఠమే గలదు[13]. ఇదియే శాసనములలోఁ జేర్కొనినదానికి సరిపడును.

ఇట్లు లీపద్యమునందుఁ జేర్కొనిన పంచారామములకును, శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమునం దుదాహరించిన పంచారామములకును సామ్యము సర్వవిధములఁ బొసఁగియుండుటచేతను, ఈ ప్రసంగమున నుదాహరించిన శాసనములు శ్రీనాథుని కాలమునకు వెనుకటివి సమకాలికములు తరువాతివి కూడనై యుండుటచేతను, వానికి సరిపడిన భీమేశ్వరపురాణమునందలి యంశములు

12. చూ. S.I.I. Vol V No 136, 137, 139.

13. చూ. శ్రీ సూర్యనారాయణ విజ్ఞానంద గ్రంథాలయమునందలి తాటియాకుప్రతి. సంఖ్య 99.

చారిత్రకముగా సత్యములనుట నిర్వివాదమైన విషయము.

పంచారామముల ప్రశస్తిని దెలుపునది పైసీసపద్యమును బోలిన శాసనసీసపద్యమే మఱియొకటిగలదు. ఇదియును పైనం జెప్పిన సోమనమంత్రి నెలకొల్పినదియే. ఇది బెజవాడలో ఇంద్ర కీలపర్వతసమీపమున శిలమైయున్న మండపములో నొకరాతి స్తంభముమీఁదఁ జెక్కఁబడియున్నది. శాసనకాలము శక. సం. ౧౩౬౮. క్రీ.శ. 1446. 14.

సీ. భీమాపురము దాక్షారామ వాల్కాలను [ద్రా]
చ్యారామపురి శ్రీమదమరడాలు
య [న] ను నంద్రధరణి పంచారామముల మహా
దేవరలకు బుద్ధదేవరకుం
జేంద్రబోల నమ్మహాసేనునకునుం బిద
పురము హుంకారశంకరకిం గరము
రూఢికెక్కిన బెజవాడ మల్లేశ్వర
దేవరకు నఖండదీపతతులు
పెట్టి గొంటూరం జెఱ్వులం జెక్కు గుడ్లు
నిల్పి సస్తసంతతు లసంఖ్యముగం జేసి
దత్తెనామాత్యసోముండు ధర్మపరుండు
దారభానుజుం డాచంద్రతారకముగ 15.

ఈ పద్యములోను వెనుకటి శాసనసీసపద్యమునందును జెప్పఁబడిన పంచారామములు నొక్కటియే. 1. భీమాపురము సామర్లకోట భీమవరము (కుమారారామము) 2. దాక్షారామ

14. చూ. S.I.I. Vol IV No 742.

15. చూ. శాసనపద్యమంజరి-ప్రథమభాగము No 20 పుట ౬౭
S.I.I. Vol IV 742

దాక్షారామము. 3. పాలకొల్లను- పాలకొల్లు (క్షీరారామము) 5. అమరడాలు-అమరారామము 4 ఇఁక వెనుకటి పద్యములోఁ జేర్కొనిన గుడిప్రాండికి బదులుగా నీపద్యమున 'ద్రాచ్యారామపురి' అను పాఠము దక్షిణహిందూస్థాన శాసనసంపుటము నాల్గవభాగములో ముద్రితమై యున్నది. కీ. శే. జయంతి రామయ్యగారు తమ శాసనపద్యమంజరిలో నీ పద్యమును ప్రకటించుచు పుటయడుగున "ద్రాక్షారామపురి అని చదువవలయును" అనినారు[16]. కాని శ్రీయుత మల్లంపల్లి సోమశేఖర శర్మగారు పంచారామములను జేర్కొనిన యీ శాసనపద్యములను రెండింటిని నాకు వ్రాసి పంపుచు నీ పద్యములో 'దచ్యారామపురి' అను పాఠము నెఱిఁగించియున్నారు. జయంతి రామయ్యగారు సూచించిన 'ద్రాక్షారామపురి'అను పాఠ మిచట సరిపడదు. ఈ పద్యములో రెండవ యారామముగా 'డాకరేమి' గ్రహింపఁబడినది, 'డాకరేమి' యనఁగా బహుశాసనప్రసిద్ధమైన దాక్షారామము. మరల దాక్షారామమున కిటఁ బ్రసక్తి లేదు. ఇఁక 'దచ్యారామపురి' అను పాఠమును దీసికొని, 'దక్షిణారామము' అను నర్థమును దీసికొనవలసియున్నది. ఇదియే గుడిప్రాండి సోమారామము. ఇది గౌతమీనదీతీరంబున దక్షిణకూలంబున నుండిన యారామ మని శ్రీనాథుఁడు తెలిపియున్నాఁడు; గావున, దక్షిణారామము దచ్యారామమై యుండెనేమో ? ఏమయినను ఈ సోమారామమునుగూడ గ్రహించినఁగాని పంచారామములు పూర్తి గావు. మఱియు నీ పద్యశాసనము సీసము నాలుగుపాదములలోను గోదావరీ కృష్ణవేణీనదీ

---

16. చూ. శా. ప. మం. ప్రథమ. పుట ౨౯.

తీరములందుఁ బ్రఖ్యాతములైన పుణ్యక్షేత్రములు చేర్కొనఁ
బడినవి. పంచారామములందలి మహాదేవతలు భీమేశ్వరపురా
ణమునందుఁ బ్రసిద్ధముగ వర్ణింపఁబడినవారే. వీరితోపాటుఁ
నాఁడు బుద్ధదేవరకుఁ గొలువుసేత పుణ్యదాయకముగా నాఁటి
వారు తలఁచెడివారని యీ శాసనమున మనకుఁ దెలియవచ్చు
చున్నది. ఈ సీసపద్యము మూఁడవపాదమునఁ జేర్కొనిన 'పిఠా
పురము హుంకారశంకరి' యనఁగా పిఠాపురమునందలి హుంకా
రిణీశక్తి. భారతదేశమందలి యష్టాదశమహాశక్తి పీఠములలో
'హుంకారిణీశక్తిపీఠ' మొకటి. పిఠాపురమున నేఁడు హుంకా
రిణీశక్తిపీఠముగాని, ఆశక్తివిగ్రహముగాని కానరాదు. ఆ హుం
కారిణీశక్తికి పీఠమగుటచేతనే దీనికి పీఠికాపురమను పేరువచ్చినది.
ఈ హుంకారిణీశక్తి విగ్రహము, రైలుస్టేషనుకెదురుగఁ గాన
వచ్చు నెత్తయిన మట్టిదిబ్బలో భూస్థాపితమై యుండినట్లు లచటి
వారు చెప్పుకొను నైతిహ్యము మాత్రము గలదు. పిఠాపుర
మునకు పాదగయాక్షేత్రమని ప్రసిద్ధి. అచటి యీశ్వరుఁడు
కుక్కుటేశ్వరుఁడు, విష్ణువు కుంతీమాధవదేవుఁడు. హుంకారిణీ
శక్తి యీనాఁడు గానరాకుండినను ఈ శాసనకాలమునకు వెనుక
ముందుల నీ శక్తిపీఠమగు 'పిఠాపురమునకుఁ' బ్రసిద్ధమైన పుణ్య
క్షేత్రములలో గణన యుండెడిది. శ్రీనాథుఁడును భీమేశ్వరపురాణ
మునం దీ హుంకారిణీశంకరిని బలుమాఱులు స్మరించియే
యున్నాఁడు. పీఠికాపురమును వర్ణించుచు "హుంకారిణీదేవికి
విహారసంకేతభవనంబును" అనినాఁడు. "శాంతస్వాంతుఁడు గొల్చె
దానవచమూసంహారిణిన్ హుంకృతిన్" అనియు నుగ్గడించి

నాఁడు[17]. వేఱొకచోట అగస్త్యునిచే, వ్యాసునకు భీమమండ
లమునందలి దివ్యక్షేత్రములను బ్రదర్శింపఁజేయుచు,

'అదె కుక్కుటేశ్వరం బయ్యె పాంతము మీద
హుంకారిణీదేవి యోలగంబు'

అని యనిపించినాఁడు[18].

గోదావరీకృష్ణవేణీ నదీతీరములందలి ప్రసిద్ధక్షేత్రము లన్నియు శివక్షేత్రములే. కృష్ణవేణీతీరమున శ్రీశైలమున మల్లికార్జునుఁడు, అమరారామమున అమరేశ్వరుఁడు, బెజవాడ మల్లేశ్వరస్వామియు నీశ్వరమూర్తులే. ఆనాఁడీక్షేత్రము లన్నియు మహావైభవములతోఁ దులతూఁగుచుండెననుట కప్పటిశాసనములు తార్కాణములై వెలయుచునేయున్నవి. పుణ్యము వర్ధించు దత్తైనామాత్యసోముఁడు పంచారామములందు నఖండదీపముల నిలుపుచు వానితోపాటు చేబ్రోలఁ గుమారస్వామికిని పీఠికాపురమునందలి హుంకారిణీశంకరికిని విజయవాటిక మల్లేశ్వరునకును నఖండదీపములు వెలయించుటచే, నానాఁడీక్షేత్రము లన్నియు సమాన ప్రతిపత్తిగలవిగా నుండెనని మనకుఁ దెలియవచ్చుచున్నది.

పంచారామములందును దక్షారామము భోగమోక్ష నివాసమగుటచే నత్యుత్తమ మని భీమేశ్వరపురాణమునందుఁ బలుతావులందు వర్ణింపఁబడియేయున్నది. ఈ విషయము శ్రీనాథునకుఁ బూర్వము శక, సం. ౧౦౭౧ క్రీ. శ. ౧౧౪౯ నాఁటి

17. చూ. భీమ. ౨. అ. ౫౫,౫౭. ప.

18. చూ. భీమ. 3. అ. ౫౫. ప.

దాక్షారామ భీమేశ్వరాలయమునందలి శాసనమునఁ బ్రసిద్ధమై యున్నది.

శా. ధీరోదాత్తుఁడు గామినాయకుఁడు భక్తింజేసి, నిత్యస్థితిని
భూరిఖ్యాతి శకక్షితీశసమములు భూశైలదిక్సంఖ్యయం
దారామంబుల నెల్ల నాయకముగా నత్యున్నతిఁ బొల్చు దా
క్షారామంబున నిల్పె దీపము సదాఖండప్రభాభాసిగాను 19.

దాక్షారామభీమేశ్వరాలయమున రెండు పద్యశాసములుగలవు. దానిలో మొదటి శాసనమునకుఁ గాలము తెలియుచున్నది. రెండవ శాసనము కాలము ఆశాసనమున లేదు. ఏకకవి విరచితములే యగుటచే రెండిటికాలము నొక్కటియే యగునని శ్రీ. శ్రీ. జయంతిరామయ్యగారు తమ శాసనపద్యమంజరిలోఁ దెలిపియున్నారు[20]. వీనిలో మొదటి శాసనము దాక్షారామ దేవాలయమునందలి విశిష్టతను, పరివారదేవతల ప్రాశస్త్యమును వక్కాణించు చున్నది.

శకవరుషంబులు ౧303 గు నేంటి వైశాఖ శు ౧౦ గు.

సీ. నందిదీపావళి నాట్యకల్యాణ హో
మశనివారగయార్క మండపములు
దిరుచుట్టుమాలిక దివ్యలింగంబుల
గుళ్లువజ్రంపురాకోట గోపు
రములు పాతాళగేహములు సోపానభాం
డాగార వివిధధాన్యాలయములు
వంటయిండ్లు సతుర్ద్వారకవాటములు
శ్రీమ దాక్షారామభీమనాథు

19. చూ. S. I. I. Vol. IV. No. 1073.
20. చూ. శాసనపద్యమంజరి- ప్రథమభాగము. ౯౨. ౯3.

నగరనాచంద్రతారకోన్నతులఁ జెళల
వెలయఁ జేయించె ననవేము వేమరాను ?
విజయచండధాముని జగనొబ్బగండం డహిత
ఖండనోద్దండదో దండమండనుండు.

ప్రకాశభారతీయోగికావ్యం । పెద్దనాచార్య్య లిఖితం శ్రీ[21].
ఈ పద్యములోఁ దెలిపిన పాతాళగేహములు ధాన్యాలయములు దక్కఁ దక్కిన వన్నియు నీనాఁడు భీమేశ్వరాలయమున జతఁగూడియే యున్నవి. దీని తరువాతి శాశనమిది___

సీ. అమరాద్రి భీమేశ్వరావాస మధిస
ప్తకము శ్రీసప్తగోదావరంబు
వలయాచలేంద్రంబు వజ్రపు ప్రాకోట
గులపర్వతంబులు గోపురములు
తిరుచుట్టుమాలియ యరవిందజాండ మ
మర్త్యలోకము నాట్యమండపంబు
పరివారదేవతా భవనంబు లీచతు
ర్దశభువనంబులు (దా)రకములు
కనకకుంభతతులు గాంగ దాక్షారామ
మన్నవోంతు వేమనానుజాండు
గడు నపూర్వశ్రిష్టి గావించి వాసన
కెక్క శ్రీవేమసితయశుండు.

ప్రకాశభారతీయోగికావ్యం । పెద్దనాచార్య లిఖితం[22].

ఈపద్యమునందు – శ్రిష్టి – సృష్టి అని చదువునది. నాల్గవ పాదము "శ్రీలకెక్కవేమ సితయశుండు" అని యుండనోపు-నని

21. చూ, S. I. I. Vol. IV. No. 1073.
22. చూ. S. I. I. Vol. IV. No. 1380.

జ. రామయ్యగారు శాసనపద్యమంజరిలో సూచించియున్నారు[23]. ఈ శాసనపద్యములందు రెండింటను గావ్యత్వ మమరియె యున్నది. శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందలి పద్యముల పోలిక వీనిలోఁ గాన వచ్చుచున్నది. వీనిలో రెండవపద్యము భీమేశ్వరపురాణమునందలి యీక్రిందిసీసపద్యమును బ్రత్యేకముగఁ బోలియున్నది.

సీ. ఆంధ్రభూభువనమధ్యము పుండరీకంబు
సప్తగోదావరజలము తేనె
బ్రహ్మసంవేద్యాదిబహుతీర్థములు రేకు
లకరులు చారుదివ్యస్థలములు
నాళంబు లవణాబ్ధివేలావిభాగంబు
కల్యాణభోగమోక్షములు తావి
దక్షవాటీమహాస్థానంబు కర్ణిక
హంసంబు భీమనాయకుఁడు శివుఁడు
గౌతమీసింధుకాంతేయ కన్యనదులు
తుల్యభాగయు నేలేఱు నుమ్మికొనలు
భువనసంభావ్యమైన యీ పుణ్యభూమి
యనఘసంసారతాపశాంత్యౌషధంబు.

భీమ. ౨ అ. ౫౧ ప.

శ్రీనాథుఁడు, భీమేశ్వరపురాణమునకుఁ గృతిభర్తయైన బెండపూఁడి అన్నామాత్యుని వంశము నభివర్ణించుచు, అన్నామాత్యుఁడు దేవయ కుమారుఁడనియు, వేమవీరభద్రారెడ్లకు మంత్రియైరాజ్యకార్యధురంధరుఁడుగా నుండి భీమేశ్వరాలయమునకుఁ దూర్పుద్వారము సమీపమున సప్తగోదావరీసోపానసరణికెలన

23. చూ. శా. ప. మం. పుట. ౯౭.

మంటపమును రచించె ననియుఁ దెలిపినాఁడు. ఆ పద్యములివి—

క. శ్రీవీరభద్రదేవ
క్ష్మావరరాజ్యాభివృద్ధి కారణమునకున్
లావణ్యరూపసంపదఁ
బూవిలుకానికిని బెండపూఁడన్ననికిన్.

సీ. రాజమహేంద్రదుర్గమునఁ గావించె శ్రీ
 వీరభద్రునకుఁ బ్రాకారరేఖ
నిలిపె మార్కండేయ నీలకంఠుని మ్రోల
 రామేశుఁ దమతల్లి నామకముగ
సంగమేశ్వరదివ్య శంభులింగమునకుఁ
 గల్పించెఁ గల్యాణగర్భగృహము
దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి
 బెంగలివాకిట ధామమును రచించెఁ
బ్రాగ్దిశావప్రగోపుర ప్రాంగణమున
సప్తమునిసింధుసోపాన సరణికెలనఁ
దీర్చె భవనంబు భీమయదేవునగర
మంత్రిదేవుఁడు యన్నయామాత్యవరుఁడు.

భీమ. ౧ ఆ. ౭౪ ప.

బెండపూఁడి అన్నామాత్యుఁడు చేసిన పుణ్యకార్యము లీసీస పద్యమునందు శ్రీనాథునిచేఁ బేర్కొనఁబడినవి. సీసపాదములలోఁ దెలిపిన వానిని దార్కాణించు శాసనములుకూడ నుండి యుండవలెను. గీత పద్యమునందలి విషయము నీక్రింది శాసనము తార్కాణించుచున్నది. దాక్షారామదేవాలయమునకు మొట్టమొదటి ప్రాకారమునకు నాలుగు దిక్కులందును నడుమ పెద్ద పెద్ద గోపురము లున్నవి. వానిలో తూర్పు దిక్కునందలి గోపు-

రము సప్తగోదావరతీరమునం దున్నది. అచట గోపురమునకు గోదావరసోపానసరణికి నడుమ నొకమండపము గలదు. దాని నన్నామాత్యుఁడు కట్టించి యచటనే యొకశాసనము నెలకొల్పి నాఁడు.

On a pillar in the Mandapa near the Sapta-Godavari tank in Daksarama village.

శ్లో. అస్తి ప్రశస్తమతి రల్లయవేమభూపో
రాజోన్నతో జగతి రాజమహేంద్రపుర్యాం।
మంత్రీ హితో స్య మతినిర్జిత దేవమంత్రి
ది(దా) వ్యశ్రియా జయతి దేవయ అన్నమంత్రీ॥ ౧.
శాకే పుష్కరబాణవిశ్వగణితే సంవత్సరే కీలకే
కార్తిక్యాం శనివాసరే సుకృతధీః శ్రీయన్నమంత్రీశ్వరః।
దాక్షారామజభీమలింగపురతః శ్రీ సప్తగోదాతటే
ప్రాచీగోపురమణ్డపం సమకరో ద్రమ్యం శిలానిర్మితం॥ ౨.
ద్వాదశసంఖ్యాస్తంభే
సదా బహిర్ద్వారమండపే విహరన్
రక్షతు భీమేశో౽యం
శ్రీదేవయ యన్నసచివ మాకల్పం॥ [34].

ఈ శాసనము శ్రీనాథుఁడు దెలిపినట్టులు బెండపూఁడి అన్నమంత్రి గొప్ప శివభక్తుఁ డనువిషయము నుగ్గడించుచున్నది. ఈ శాసనము నందలి తుది శ్లోకమును బట్టి "తాను భీమేశ్వరున కెదురుగఁ గట్టించిన పండ్రెండు స్తంభములుగల యా మండపమున విహరించుచుండు భీమేశ్వరుఁడు రక్షించుఁగాక" యని

34 చూ. S. I. I. Vol. IV, No. 1381.

యాత్రని ప్రార్థనము. ఈ శాసనము నెలకొనియున్న మండపమును 'సూర్యభారామండప' మని వ్యవహరింతురు. నేటికి నీ శాసనము సప్తగోదావర తటమునం దుండి యనన్యమాత్మ్యాసి యశఃప్రశస్తుల నుగ్గడించుచునే యున్నది.

భీమేశ్వరపురాణమున సర్పపురమును (నేటి సర్పవరమును) వర్ణించు ప్రకరణమునం దిట్లు తెలిపినాడు.

శా॥ కాంచె స్సర్పపురాభిధానముఁ ద్రిలింగక్షోణికై కుంఠముఁ
గుంచెం నారదకుండికాజలముల న్మోదంబుతో దేహముఁ
జించెం గాశివియోగదుఃఖము మహాక్షేత్రంబు వీక్షించి ద
ర్శించెం సన్మునిలోచనోత్సవముగా శ్రీభావనారాయణున్.

భీమ. ౨. ౬౫.

ఈ పద్యమునఁ జెప్పఁబడినవి – సర్పపురము, నారదకుండము, భావనారాయణస్వామియును. ఇవియన్నియు సర్పపుర శాసనములలో "శ్రీసర్పపుర భావనారాయణ పెరుమాళ్ళకు" అనియు, "శ్రీభావనారాయణ పెరుమాళ్లకు ఎడ్లగోపీనాథు నారదగుండాము గట్టున బ్రిం(దా)వనకై నేల" అని యుగ్గడింపఁబడియే యున్నవి[25].

ఈ తీరుగ శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమునందుఁ జెప్పఁబడిన చరిత్రాంశము లన్నియు, తాను స్వయముగఁ జూచి వర్ణించిన వానిటచే, నించుక పరికించిన వానివాని కన్నిటికిని శాసనాదిప్రమాణము లన్నియు నుపలబ్ధ మగుచున్నవి.

ఓమ్శమ్

25 చూ. S.I.I Vol V. No. .0.14

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 8 | దీనికి | దీనికీ |
| ,, | 18 | మఁదిర | మందిర |
| 7 | 15 | ఈనది | ఈనదీ |
| 11 | 13 | క్రీడా | వ్రీడా |
| 19 | 14 | లపలీ | లవలీ |
| 24 | 20 | గోనా | గోదా |
| 25 | 4 | జర్పింస | జర్పింప |
| 27 | 7 | పాధాన్య | ప్రాధాన్య |
| 28 | 15 | ధూర్త | ధూర్త |
| 30 | 3 | వధూ | వధూ |
| ,, | 5 | స్థానక | స్థాసక |
| ,, | ,, | ధపళి | ధవళి |
| 24 వ పంక్తిలో చివరి 'త్రోటు' 23 వ పంక్తి చివరనుండవలెను. | | | |
| 31 | 5 | లథిక | లధిక |
| 32 | 5 | లమున | లమును |
| ,, | 9 | పయోథి | పయోధి |
| ,, | 22 | విద్యాఖి | విద్యాధి |
| 33 | 6 | తరఁగి | తరంగి |
| 36 | 24 | క్టేశ | క్లేశ |
| 40 | 22 | వాదోన్నై | వాదోడున్నై |
| [illegible] | 17 | ప్రతిష్టి | ప్రతిష్ఠి |